# పురుష లక్షణం

people may forget what you said ,people may forget what you did,but they will never forget how you made them feel. - Maya Angelou

**Tuesday, September 7, 2010**

## రచయిత పరిచయం : (2)

THE Screenplay FACTORY

ప్రాథమిక అంశాలు :

1. ప్రాముఖ్యత (significance): సంఘర్షణకి దారితీసే లేదా కారణమయ్యే పరిస్థితులకి తగినంత ప్రాముఖ్యత ఉండాలి.
ఉదా:శివ సినిమాలో శివ,భవాని మధ్య శతృత్వం ఏర్పడటానికి ఎంత జాగ్రత్త తీసుకున్నారో శ్రద్ధగా గమనించండి....ఆ సినిమా మధ్యలో ఉండగా వారిద్దరూ శత్రువులు కాదంటే ఎవరూ నమ్మరు.
2.ఇతివృత్తం (theme): మానవ జీవితాలకి సంబంధించిన ఏదో సత్యం, రచయితని కథ రాసేలా ప్రేరేపిస్తుంది.(ఇతర భాషా చిత్రాలు కాదు)సత్యం అంటే సందేశం కాదు.వీటిల్లో Up End, Down End, Ironic End అని 3 రకాలుంటాయి.
*కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.(తర్వాత వివరంగా చర్చిద్దాం)
ఉదా : 1.సమరసింహా రెడ్డి: ప్రేమ విలువ తెలుసుకున్న మనిషి ప్రాణం విలువ తెలుసుకుంటాడు.
2.టైటానిక్ & క్షణ క్షణం: విలువైనవి ఒదులుకున్నప్పుడే వెలకట్టలేనివి పొందగలం.(ఈ themeకి టైటానిక్ సంపూర్ణంగా న్యాయం చేసింది.)
3. Rashomon: There are no facts only interpretations.
4. American Beauty: Misinterpretation spoils human relations.
5. దేవదాస్: బంధానికి బానిస ఐన వ్యక్తి బానిసగా మరణిస్తాడు. Etc...
3. కాల పరిమితి (Unity of time): నియమిత కాల పరిమితికి లోబడి (time period) కథా పరిధి ఉండాలి.(depends upon chronology of content & story)

ఉదా: ఇది రెండు రకాలు:
అ).కథ ఏ కాలం లో జరుగుతుంది.(భూత,భవిష్యత్,వర్తమానం)(period) ఆ).మొత్తం కథంతా ఎంత సేపట్లో చెప్తున్నాం.(duration)
4. స్థల పరిధి (Unity of place): కథ అవసరానికి నిర్దేశించిన - నియమిత స్థల పరిధిని , కథనంలో అతిక్రమించకూడదు.{భౌగోళిక పరిస్థితులు (Geography)}
5. నియమిత చర్యలు (Unity of action or Theme): ఇతివృత్తాన్ని అనుసరించి కథకు నిర్దేశించబడిన పరిమిత చర్యలను కథనంలో అతిక్రమించకూడదు.
ఉదా: కథలో చర్చిస్తున్న సమస్య , చర్య - ప్రతిచర్యలు ఇతివృత్తాన్ని దాటిపోకూడదు.... అంటే కుటుంబ సమస్యల గురించి చర్చిస్తూ సమాజంలో అవినీతి పై కొరడా ఝుళిపించకూడదు
6.వాస్తవమే అనే భ్రమ (Illusion of reality or willing suspension of disbelief) :కథాగమనం వాస్తవికంగా ఉందని ప్రేక్షకుల్ని నమ్మించడానికి కథా పరిచయం, పాత్రల పరిచయం,వాటి చర్యలు,ప్రేరణలు వాస్తవికంగా ఉండేలా జాగ్రత్త తీసుకోవాలి.
ఉదా: ఉదా: jurassic park చిత్రంలో కథ పరిచయం(setup) చూడండి :

ACT-I
Premise(కథ ఆవరణ)
1.Raptor ని cage నుండి park కి తరలిస్తుండగా జరిగే ప్రమాదం.
2.lawyer, Hammond(పాత్ర పరిచయం)కోసం exavations జరిగే ప్రదేశానికి రాగా Dr.Grant పాత్ర పరిచయం.
----- ------
Introduction to the Protagonist(Hero) (హీరో పరిచయం)



**Blog Archive**


► 2012 (7)
▼ 2010 (7)
► October (1)
▼ September (6)
ద్వాదశి చక్రములు
ప్రతి కథకీ కావాల్సిన స్క్రీన్ ప్లే
ఆత్మని రక్షితే సర్వం రక్షితం భవతి
O Captain Where ART thou?
రచయిత పరిచయం : (2)
రచయిత పరిచయం




**About Me**



Aaditya Chowdary Mulpuri

Those that know do,Those that understand teach.

View my complete profile



**My Blog List**

గురుకులం



అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ సమర్ధ సద్గురు శ్రీ శిరిడీ సాయినాధ మహరాజ్ కీ జై - ఓం శ్రీ సమర్ధ సద్గురు సాయినాధాయ నమః *శిరిడీ సాయి బాబా జీవితంలో ముఖ్యఘట్టాలు*: 1.మొదట 16 సంవత్సరాల బాలుడిగా ప్రకటితమైన సంవత్సరం - 1854(వేప చెట్టు - ప్రస్తు...
*2 years ago*

ప్రకృతి & సౌందర్యం



కల్లోలం... - కలలు.. నిజం కావు ఎందుకో తెలీదు.. కల మధురం, ఐనా ఆయుష్షు అల్పమే అని తెలీదు.. తెలిసీ తెలియని వాస్తవాలే కలలై...కరుగుతాయని తెలీదు.. నిదుర లేచాక స్వప్న...

3.ఇప్పుడు మనం Hammond,Grant,Satler పాత్రలని చుస్తాం + Contract పై ఒప్పందం.
------------
the Hook or Inciting Incident(ప్రేరణ కలిగించే అంశం)
4.Nedry పరిచయం.(కేవలం పరిచయం కాదు ప్రతి సన్నివేశంలో కథకి సంబందించిన సమాచారం ఉంటుంది)
-------------------
Introduction to the other characters (ఇతర పాత్రల పరిచయం + కథా సమస్య పరిచయం)
5.Malcolm పాత్ర పరిచయం + ఇతర పాత్రలు పార్క్ చేరుకొవటం
6.park security గురించిన సమాచారం.
7.మొదటిసారిగా Dinosaurs చుస్తాం.
8.Dinosaurs creation. (expostition - tool)
9.Dinosaurs సృష్టి పై భిన్నభిప్రాయాలు.
10.Dinos feeding
11.Dinner
12.kids Intro
12.Preparation
13.Journey Starts .....
-----------
ACT II Commences ----(కథావస్తువు లేదా అసలైన కథ)...
----------------------
ఈ విధంగా పరిచయం చేశాక కూడా ఆ కథా ప్రపంచాన్ని నమ్మకుండా ఎవరైనా ఉండగలరా?
ఒక అవాస్తవికమైన కథని(కల్పితం) వాళ్లు ఎలా నమ్మిoచగలిగారు?
Dinosaurs ని సృష్టించడం కళ్ళతో చూసాక కూడా నమ్మకుండా ఉండగలమా?
పాత్రల ప్రవర్తన - కథలో చర్చించే అంశానికి దగ్గరగా పాత్రల జీవితాల్ని తీసుకురావటం (వారి వృత్తి - వారి ఆశలు,అవసరాలు,ఆశయాల్లో స్పష్టత చూడండి)
అందుకే spielberg ప్రపంచంలోనే అత్యుత్తమ దర్శకుడు.ఈ ఒక్క స్క్రీన్-ప్లే చాలు నేర్చుకోడానికి.100 సినిమాలు చూడక్కర్లేదు.
7.సంభావ్యత (Probability): కథగమనం వాస్తవమే అనే భ్రమ కలుగజేసేప్పుడు, కథలో జరుగుతున్న సంఘటనలు వాస్తవంగా అలా జరిగటానికి కనీస అవకాశం ఉంది అనిపించేలా ఉండాలి.
ఉదా : Alien అనే హాలీవుడ్ సినిమాలో గ్రహాంతరజీవులు వున్నాయి నమ్మించడానికి రచయిత వాటిని చూపించక ముందే వాటి వల్ల జరిగిన నష్టాన్ని చూపిస్తాడు...(ఇలా జరిగితే నమ్మకుండా ఉండలేం కూడా.)
(Illusion of reality, probability and lead-up and preparation are closely relative, yet each serves
it's purpose)
8.హఠాత్తుగా జరిగే పరిణామాలు లేదా సంఘటనలు (Coincidence): అప్పుడప్పుడు హఠాత్తుగ జరగటానికి అవకాశం ఉన్న సంఘటనల్ని, సందర్భవశాత్తు జరిగిన వాటిగ నమ్మించాలి.
ఉదా:సమరసింహా రెడ్డి సినిమాలో కథ ప్రారంభం నుంచి హీరోని విలన్స్ వెతికే ప్రయత్నాలు,అతని ప్రాణం వారికి ఎంత విలువైనదో కూడా చూపించడం గమనించండి - ఇప్పుడు మన ఉదాహరణ చుద్దాం - సినిమా విశ్రాంతి దగ్గర్లో సత్యనారయణ,బాలకృష్ణకి దణ్ణం పెడితే మనకి ఏమనిపిస్తుంది?మనం ఊహించింది నిజమే హీరో వెనుక యేదో కథ ఉంది అనిపిస్తుందా?లేక సత్యనారాయణకి పనీ-పాట లేక బాలయ్యకి దణ్ణం పెట్టాడు అనిపిస్తుందా? - ఇదే అనుభవజ్ఞుల దగ్గరనుంచి మనం నేర్చుకోవల్సింది - ఉపకరణాలను అవసరానికి మాత్రమే ఉపయోగించటం.ఎక్కడో set-up చేస్తే ,దాని అవసరం ఎక్కడ వచ్చిందో గమనించండి.ఈ tool ని తప్పుగా అర్థం చేసుకుంటే, ఓ సినిమాలో - తుపాకి చూపిస్తున్నప్పుడే ఈ తుపాకి భవిష్యత్ లో హీరో నిస్సందేహంగా ఎక్కడో వాడేతీరతాడు అని జోస్యం చెప్పగలిగేలా ఉంటుంది.
9.పరిచయం చేయటం & సిద్ధం చేయటం (Lead-up & preparation): హఠాత్తుగా జరిగటానికి అవకాశం ఉన్న సంఘటనల మూలాల్ని వాటికన్నా ముందు వచ్చే సన్నివేశాల్లో పరిచయం చేయటం ద్వారా ఈ సమస్యని అధిగమించవచ్చు.
ఉదా: అ)సమరసింహా రెడ్డి సినిమా ప్రారంభంలో ఓ కుటుంబాన్ని పరిచయం చేస్తారు - బాలకృష్ణని పరిచయం చేయగానే చిన్నప్పుడు పారిపోయిన పిల్లవాడే అనుకుంటాం...రహస్యం విప్పినప్పుడు గానీ ఎవరు-ఏంటో అర్ధంగాదు.ప్రారంభంలో కుటుంబాన్ని "పరిచయం" చేయటం వల్ల కలిగిన ప్రభావం అది.పరిచయం చేయటం అనే tool ని రచయితలు బాగా అధ్యయనం చేయాలి.దీని ఉపయోగాలకు అంతులేదు.రచయితకి నైపుణ్యం ఉందా? లేదా? అనేది ఈ ఒక్క tool అతనెలా ఉపయోగిస్తున్నాడో చూసి చెప్పెయ్యొచ్చు.
ఆ)Jurassic Park లో Nedri,Mafia నుంచి డబ్బు తీసుకోవటం + Hammond పై డబ్బు విషయంలో అసంతృప్తి వ్యక్తం చేయటం.next - Dino embryo రహస్యంగా mafia కి అందించే ప్రయత్నం.
10.మానవీయ కోణం & హృదయాసక్తి (Human interest & Heart interest): మిశ్రమ వర్గాల ప్రేక్షకుల భావోద్వేగాల్ని తట్టిలేపడానికి human interest & heart interest అనే ఉపకరణాన్ని ఉపయోగించాలి.
* Human interest ని professional life, తన చుట్టూ ఉన్న ప్రపంచంలో ఇతరులతో (ఇరుగు పొరుగు)సంబంధాలు అనే అర్థంలో వాడొచ్చు.Human Interest = curiosity

1 year ago

**ప్రణుతి**



12.దత్తావధూత సమర్థ సద్గురు నాయుడు స్వామి మహరాజ్ (లక్ష్మీ పురం, కర్నూలు జిల్లా) - నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః మహాముని మౌన ప్రభోదాకృత దక్షిణామూర్తి వేదవేదాం...
6 months ago

**భక్తి & భగవంతుడు**



3/A.భగవంతుడు (ఆధ్యాత్మికం) - విఘ్నేశ్వరునికి - సరస్వతి మాతకి నమస్కారం - శ్రీ గురుభ్యో నమః గురుదేవులు సమర్థ సద్గురు సాయినాధ మహరాజుకి, దత్తావధూత సమర్థ సద్గురు నాయుడు స్వామి మహ...
4 months ago

**భాష & భావన**



స్పందన - శాంతి, స్వచ్ఛత, అణకువ, విధేయత ఇస్లాం పదానికి అర్థం అరబిక్ పదం సలేమా నుండి పుట్టిందిది... నువ్వెక్కడ పుట్టావు.. ఎక్కడ పెరిగావు.. నీ మూలమేది.. ఈ దేశం తిండి...
4 months ago

**సాహితీ వనం**



భావన - యుగాలు క్షణాలై కాలం గతించిపోనీ, నేను నీవను భావన, నీలో కరిగిపోనీ. - మూల్పూరి. ఆదిత...
1 year ago

**Followers**

Join this site
with Google Friend Connect

**Members (3)**



Already a member? Sign in

* Heart interest ని కుటుంబ సభ్యులు, ఇతర బంధువులు, స్నేహితులతో సంబంధ,భాంధవ్యాలు అనే అర్థంలో ఉపయోగించవచ్చు. Heart Interest = Concern
11.ప్రేమ (Love Interest): బహిర్గతమైన ప్రేక్షకుల భావోద్వేగాల తీవ్రత పెంచడానికి ఈ ఉపకరణం తరచుగ ఉపయోగిస్తారు.
love interest అనే పదాన్ని Heroine తో ప్రేమ అనే అర్థంలో కుడా వాడతారు.
ఉదా : శివ సినిమా ద్వితియార్థంలో heroine kidnap
12.హాస్యం (Comedy or Humor): సంఘర్షణ తీవ్రమైన ఉద్రిక్తతా స్థాయికి చేరినప్పుడు ప్రేక్షకుల "మనసులను" తేలికపర్చటానికి హాస్యాన్ని ఉపయోగించాలి.
13.నాయకత్వ లక్షణాలు (Heroic Values): కథానాయకుడికి ప్రత్యేకమైన గుర్తింపు,అతనిపై ఆదరాభిమానాలు కలుగజేయటానికి , ఆతనికి నాయకత్వపు లక్షణాలు ఆద్దాలి.
* ఇది Hero Image అనబడే భ్రమని బట్టి కాకుండా, కథానుసారంగా ఉంటే సహజంగా అమరుతుంది.
> వాస్తవానికి Image ని భాధ్యతగా భావించాల్సిన హీరోలు, అలంకారంగా భావిస్తారెందుకో? భాధ్యత అనగా నమ్మకం కలిగి ఉండుట అని భావించెదరు గాక , లేకపోతే మళ్ళీ సందేశాలివ్వలనే వెర్రి కోరిక జనిస్తుంది వెంటనే తీర్చుకోవాలనిపిస్తుంది.
14.దృశ్య ప్రమాణాలు(Picture values): సినిమా కథనం కదిలే చిత్రాల ద్వారా చుపిస్తాం దానికి ఛాయాగ్రహణం ఉపయోగిస్తాం కాబట్టి కనీస దృశ్య ప్రమాణాలు పాటించాలి.
15.నవ్యత (novelty): ఉత్తమాభిరుచి గల ప్రేక్షకుల ఆదరణ చూరగొనడానికి కథ, కథనాల్లో నవ్యత పాటించాలి.
16.కథావస్తువు (Plot): పై అంశాలన్నీ కథావస్తువులో అమరేట్లు చూడాలి.
17.ఆవరణం & నేపధ్యం (Atmosphere & Setting): పాత్రల నేపధ్యం, అవి సంచరించే ప్రదేశాలు,ఆయా ప్రదేశాలను వ్యాపించివున్న వాతావరణం - అక్కడి వేష భాషలు - వారి అలవాట్లు , జంతువులు,వృక్షాలు - అక్కడి భౌగోళిక పరిస్థితులు మనకు ఆ ప్రదేశం పట్ల ఒక అవగాహన కలిగిస్తాయి.
18. దిగ్భ్రాంతి(Shock): ప్రేక్షకులకు హఠాత్తుగా కలవరం కలిగించి వారిని భయాందోళనలకు గురి చేయడానికి దిగ్భ్రాంతిని ఉపయోగించాలి.
ఉదా: సత్య సినిమాలో బిక్కుమాత్రే ని భావు ఠాక్రే చంపుతాడని మనం ఊహించం.
19. ఆశ్చర్యం (Surprise): ఊహించని సంఘటనల ద్వారా ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలకు గురి చేయడానికి దీనిని ఉపయోగించాలి.
ఉదా: శివ సినిమాలో అమలని కిడ్నాప్ చేసినపుడు రైల్వే క్రాసింగ్ దగ్గర నాగార్జున ఎదురుపడటం.
20.రహస్యం (Mystery): ప్రేక్షకుల ఆశక్తిని పెంచిపోషించడానికి కథనంలో కొన్ని అంశాలను గుట్టుగ ఉంచి ఏం జరగబోతోందో ఊహించేలా చేసి హఠాత్తుగా వాస్తవాన్ని తెలియజేయడం.
ఉదా: బాషా, సమరసిమ్హా రెడ్డి. జంటిల్ మాన్ లో అర్జున్ దొంగ అని దాచిపెట్టడం.
Sixth Sense ప్రారంభం చూడండి ఓ చిన్న విషయం దాచి కథని ఎలా నడిపారో - అద్బుతం.
అలాగే తెలుగులో ఐతే చక్కని ఉదహరణ.
21. భయానకం (Menace): ప్రేక్షకులను భయకంపితులను చేయడానికి దీనిని ఉపయోగిస్తారు.
ఉదా: శివ సినిమాలో శుభలేఖ సుదాకర్ మర్డర్ సీన్ - నాగార్జున పై దాడి. (థ్రిల్లర్, హార్రర్ సినిమాల్లో ఈ భయానక సన్నివేశాలు ఎక్కువగా ఉంటాయి).
22. న్యాయం (Justice): మంచి - చెడులు,ధర్మము - అధర్మము,నైతికత - అనైతికత,న్యాయం - అన్యాయం... అనే విలువల మధ్య విభజన రేఖని కథనంలో స్పష్టంగా చూపించాలి.
23. భాహ్య ప్రేరకాలు (Physical Punch): ప్రేక్షకుల ఇంద్రియాలు సంతృప్తి చెందడానికి భాహ్య ప్రేరకాలని ఉపయోగించాలి. ఇవి ప్రేక్షకులలో ఉపరితల భావోద్వేగాలను తట్టి లేపుతాయి. దీన్ని ఎమోషన్ అనే అర్థం లో వాడొచ్చు.వీటి ప్రభావం తాత్కాలికం.సినిమా చూస్తున్నంత సేపే ఉంటుంది.
24. అంతః ప్రేరకాలు (Mental Punch): కథ ప్రయోజనం కేవలం ప్రేక్షకుల ఇంద్రియాల సంతృప్తి పరచడం మాత్రమే కాదు వారిలో మానసిక పరిణతి కూడా కలిగించాలి. కాబట్టి మనసు లోతుల్లో ప్రభావం చూపించే భావోద్వేగాలను ఉపయోగించాలి. దీనిని ఫీలింగ్ అనే అర్థంలో వాడొచ్చు.సినిమా చూసిన ప్రేక్షకులు ఇంటికెళ్లాక కూడా(probably life long) దాన్ని గుర్తుంచుకోవాలంటే feelings పై శ్రద్ద పెట్టాలి.
25. చర్య - ప్రతిచర్య (Action – Re Action): కథలు కారణము ఫలితము, చర్య ప్రతిచర్య అనే తార్కిక అంశాల పై ఆధారపడి ఉంటాయి. కాబట్టి ఈ విషయంలో శ్రద్ధ వహించాలి.
26. పరిశోధన & కథాంశము (Research & Material):కథని అభివృద్ధి చేయడానికి పరిశోదన మరియు విషయ సేకరణ పై రచయిత శ్రద్ధ వహించాలి.మనకున్న పరిమిత జ్ఞానంతో కథలు రాస్తే విండోస్ మీడియా ప్లేయర్ ని ,లై-డిటెక్టర్ గా చూపించాల్సి వస్తుంది లేదా ఇంటర్ కాలేజ్ inspection కి DEO రావాల్సి ఉంటుంది.

పై అంశాలు అనుభవజ్ఞులైన రచయితలు ఏ విధంగా ఉపయోగించారో అధ్యయనం చేసి మన అవసరాలకు తగినట్లుగా మనం ఉపయోగించడం నేర్చుకోవాలి. చదవటం,రాయటం అధ్యయనంలో ప్రధానమైన సాధన.చూడడం ద్వారా గ్రహించేది శూన్యం.అధ్యయనంలో సాధనే అత్యంత ప్రధానమయిన అంశం. కేవలం పాటలు వినటం ద్వారా మనం ఎలా సంగీత దర్శకులం కాలేమో కొన్ని వేల సినిమాలు చూసిన అనుభూతి తో (అనుభవం కాదు) రచయితలం,దర్శకులం కాలేము..అలాగే జ్ఞానం అంటే కేవలం ఉపన్యాసాలే కాదు..
సాధనమున పనులు సమకూరు ధరణిలోన

